# వెంగళప్ప కవితె

ఈమధ్యనకొన్ని వివాహాలముచ్చట్లు బయట బడ్డవి. ఒకహిందూ, ఒకఫార్సీ ఒకముస్లింయువతులు తమతమమతాలనుమార్చుకొన్నారు. తమ పూర్వమతములో పసలేదని క్రొత్తమతంలోసారంఉందనీ వారికి తెలిసిందనికాదు. వారికదంతా కొట్టలేదు. తామువుతాంతరులను ప్రేమించినారు. వారిని పెండ్లాడవలెనంటే వారిమతంలో చేరిపోవలెను. అందుచేత తమతమమతాలుమార్చుకొన్నారు.

సిక్కానగరులోని మంజులాఫారెఖ్ ఆస్పెషల్ రిజిస్ట్రారువద్దకుపోయి నేనుతురకనుఅవుతున్నానన్నది. ఎందుకంటే ఎచ్. సీ. రహీమతుల్లా అనేవిద్యార్థిని ప్రేమించినాను అతడునాయింటిప్రక్కనఉంటాడు. అతడు నన్ను చూచినాడు, చిరునవ్వునవ్వినాడు, ఆనవ్వుతో నన్ను గెలుచుకొన్నాడు అనిముక్తసరుగా దాచుకోకుండ చెప్పివేసింది.

రెండవస్త్రీ పద్మావతిఅనుపేరుగలది. పూనానివాసిని. ఆమెకుపెండ్లిఅయివుండింది. మగడు ౫ ఏండ్లక్రిందటనే ఆమెను వదలిపెట్టిపోయినాడు. ఇటీవల ఆమెఒకముసల్మానుని గాఢంగా ప్రేమించింది. అందుచేత మతంమార్చుకొంటేగాని వెనుకటిభామకష్ట మెంగవిడువదల్చుంది అని రిజిస్ట్రారువద్ద మొరపెట్టుకొన్నది

ఒకలేడికంటిపిల్ల చంకలోపుస్తకాలకట్టను ఇరికించుకొని దర్జాగా మద్రాసుపోలీసుకచ్చేరిలోకి నడిచింది, నేనుముస్లింఅయిపోతున్నానుఅన్నది. ఎందుకూ? అన్నాడురిజిస్ట్రారు కండ్లుమిటకరించుకుంటూ? అబ్దుల్ లతీఫ్అనే మిత్రుని ప్రేమించినాను నీకు తెలియదూ? "చిన్నపిల్ల అయితే నీవు చిన్నదానవు, నీకుహక్కులేదుఅన్నాడు అధికారి. "ఎవరన్నారు నేను ౨౧ ఏండ్లయువతిని ఇదిగోజాతకపత్రిక" అని యువతి కాగితంతీసి చూపించింది. అక్కడికిన్నీ రిజిస్ట్రారుకు నమ్మకంకలుగలేదు. తండ్రినిపిలిపించినాను విచారించితే ౧౫ ఏండ్లు, పోనీయింటికిఅన్నాడు. ఊహూ, నేనుపోనేపోనుఅన్నదిఆమె.

ఒకముస్లింబాలిక తాను హిందువునవుతానన్నది రిజిస్ట్రారుతో. ఒకఫార్సీకన్య హిందువునవుతానన్నది. కారణంప్రేమరేమో? ఈవిధంగా మన్మథుడు తనయిష్టంవచ్చినట్లు మతపరివర్తనంలో చేతంలేని మిషనరీపనిచేసుకున్నాడు.

అయితే ఒకమాట హిందువులలో వివాహవిచ్ఛేదశాసనములేదూ. అంటే పైజాతులలోలేదు. క్రిందిజాతులలో విడాకులపద్ధతియున్నది. విడాకులపద్ధతిలేనివారిలో కొందరుముసలివారు మూడోపెళ్ళిచేసుకుంటారు. కొందరుధనికులు పిల్లలులేనందున పెండ్లాముపై పెండ్లాన్ని చేసుకుంటారు. కొందరుబాల్యవివాహాలు చేసుకొంటారు పెద్దవారైనతర్వాత సాధారణంగా భార్యాభర్తలు ఒకరినొకరు అసహ్యించుకొంటారు. చాలిచాలని తండ్రులెందరోఉన్నారు భర్తలు ద్రవ్యాశచేతనో ఉంపుడుకత్తెలమోజాచేతనో మరేకారణంచేతనో భార్యలను వదలివేస్తారు. ఇట్టిసమయాలలో ఏమిచికిత్స సనాతనులేమిన్ని త్రోవచూపలేదు అట్టిస్త్రీలు రహస్యంగా వ్యభిచారమైన చేయవలెను, లేదా చచ్చేవరకు అఘోరించిరోమైనా చావవలెను కానిఇదిగో ఇక్కడఒకఉపాయందొరుకుతూఉంది. మతంమార్చుకోవడం. దానితో పూర్వసంబంధాలు పటుక్కున తెగిపోతవి క్రొత్తసంబంధం బాగాచేసుకోవచ్చును, అంతేనా?

అయితేవ్యాయస్థానంతీర్పులు ఇంకాస్పష్టంకాలేదు. సికింద్రాబాదులో టౌనుపనిచేసే ప్రముఖుడొకడైనా మాఖామాబాలికలను తెలుసుకొని వెల్లడిచేస్తే సంఘానికి ఉపకారంఉంటుంది.

వెంగళప్ప

——

# మదరాసు రాష్ట్రీ బాలికాపహరణములు

## హైదరాబాదు సంస్థానములో వివాహమునకై అమ్మకములు

మదరాసు రాష్ట్రమునుండి బాలికలను కొందరు అపహరించి దూరదేశములో వివాహము చేసికొనదలచినవారలకు దొంగకులములు, దొంగమతములుచెప్పి విక్రయించుచున్నారు. అట్టి బాలికలలో చాలమంది హైదరాబాదుసంస్థానమునందు విక్రయించబడినట్లు మదరాసు పోలీసువారలు పోయిన కొద్దివారాలలో జాగ్రత్తగాచేసినపరిశోధనవల్ల కనపడుచున్నది ఈబాలికలు సాధారణముగా బీదకుటుంబములకును మధ్యతరగతికుటుంబములకును చెందినవారలై యున్నారు.

ఈనేరములనుచేయు పెండ్లిదళారీలు సాధారణముగా చేయునదిఏమనగా, ఆడపిల్లలుగలవారలతో వారలపిల్లలకు తగినవరులను కుదిర్చెదమనియు, మరియుఆపిల్లలకై క్రయముగా డబ్బుయిప్పించెదమనిచెప్పి ఆపిల్లలుగలవారలను బెజవాడకో హైదరాబాదుకో తీసికొనిపోవుదురు కొన్ని సందర్భములలో వివాహములుకూడ జరుపబడియున్నవి-కొన్ని ఎక్కువసందిపిల్లలుఎక్కడెక్కడనో దిక్కులేకుండా వదలిపెట్టబడి, ఎంతోకష్టముపై తిరిగి మదరాసుకు చేరుకొనవలసివచ్చినది- అట్టికొందరిపిల్లలకథ లీదిగువ తెలుపబడుచున్నవి. వీటిని తెలుసుకొని ఇతరులు మోసపోకుందురుగాక!

ఒకకథలో, మదరాసునందలి ముగ్గురు ఒకస్త్రీని తనబాలికతో బెజవాడకురమ్మనిరి- ఆబాలికవివాహము హైదరాబాదు సంస్థానములోని ఒకగ్రామములో తల్లిలేకుండానే జరుపబడినది- ఆతల్లిని ఎక్కడికి పంపించిరోఏమో! మరియొక ౧౨ఏండ్ల బాలికను తల్లినుండిఅపహరించి బెజవాడయందలి ఒక నాయుడుయొక్క సహాయముతో నిజాంరాష్ట్రములోని ఒక వ్యవసాయకునికి ఇచ్చి వివాహముచేసిరి- ఆబాలిక జాడనుగూడ పోలీసువారుతీసిరి-ఈనేరముచేసినవారిపై అభియోగము పెట్టబడినది- మదరాసులోను ఒకస్త్రీ బ్రాహ్మణేతరబాలికనొకదానిని మోసముచే అపహరించి కుంభకోణ ప్రాంతీయులగు ఇద్దరువితంతువుల సహాయ్యముతో ఆబాలికను బ్రాహ్మణబాలికయని చెప్పి చాలా ఘనమూ క్రయముగా సంపాదించి అమ్మివేసినది ఆబాలికనుకూడ మదరాసుపోలీసులు జాడతీసినారు- ఆపిల్లను అపహరించినవారిపై చర్యగైకొన్నారు

మరియొక స్త్రీ తనపొరుగున ఉంటుండే ఒక బాలికనుఅపహరించి తెనాలికి తీసికొనిపోయి, అక్కడ బాలికలను విక్రయించు వ్యాపారము చేయు ఇద్దరుదళారీల తోడ్పాటుతో, ఆపిల్లను కోమటికులమునకుచెందినట్లుచెప్పి ఒక శెట్టిగారికి చాలగొప్పమొత్తమునకు విక్రయించినది. మదరాసులో ఒక బ్రాహ్మణుని, ౧౨ఏండ్లబాలికను మరియొకబ్రాహ్మణస్త్రీ ఒకధనికుడగు జమీందారుఇంటిలో ఉద్యోగమిప్పించెదననిచెప్పి మోసగించి బెజవాడకుతీసికొనిపోయి, ఆ బాలికను ఒక తెలుగుబ్రాహ్మణునికి చాలా పెద్దమొత్తానికి అమ్మి పెండ్లిచేసినది- ఇందులో కుంభకోణపుబ్రాహ్మణుడొకడును బెజవాడబ్రాహ్మణులిద్దరును తోడ్పడిరి. మరియొక బాలికను నిజాంరాష్ట్రమునకు ఒకమదరాసు వితంతువు మరియిద్దరు కుంభకోణవితంతువులతోకలిసి తీసికొనిపోవుచుండగా మదరాసుపోలీసులు వారివెంట వచ్చుచున్నారని తెలిసినది-అప్పుడు ఆబాలికను వారలు పశ్చిమగోదావరిజిల్లాలోవదలిపెట్టి పారిపోయిరి-ఆబాలికను పోలీసులురక్షించిరి. ఇప్పుడుఆసమాచారము పరిశోధన ఇంకను జరుగుచున్నది.

ఇటీవలనే ఒకబ్రాహ్మణవితంతువుతో ఆమె ౧౨ఏండ్లబాలికకు మంచి కన్యాశుల్క మిప్పించెదమనియు, భూముల పరిష్కారము చేసెదమనియుచెప్పి, ఆబాలికను బెజవాడకు తెప్పించిరి- ఆమెకుఅనుమానముకలిగి మదరాసుకు చేరుకొనెను-మదరాసువారలే మరియిద్దరుస్త్రీలు ఒకబాలికతల్లిదండ్రులను ఆబాలికను బెజవాడకు తెమ్మనిరి- బెజవాడలోని ఒక నాయుడు సాహాయ్యముతో ఆదొంగలుఆబాలికను కోమట్లకులమునకు చెందినదనిచెప్పి హైదరాబాదునగరములోని ఒకశెట్టికి ఇచ్చుటకు ఏర్పాటుచేసికొనిరి-ఆశెట్టిగారికి ఆబాలిక తనకులస్థురాలుకాదని తెలియగా, ఆయన ఆపిల్లను కుదిర్చినవారిని తానిచ్చిన క్రయధనమును తిరిగితనకుయిచ్చివేయవలసినదని అడిగెను-ఆదళారీలుడబ్బివ్వకపోగా అన్యాయంగా ఆబాలికను హైదరాబాదులో నిర్బంధముచేసిఉంచిరి-ఈవిషయము ఇంకను విచారణలోనున్నది.

ఈచెప్పిన అన్ని కన్యావిక్రయసమాచారములకును సంబంధించిన నేరస్థులు అనేకులు అరెస్టుచేయబడినారు-పోయినరెండునెలలనుండి విచారించగా ఇపుడు మదరాసునుండి అపహరించబడినకన్యలెవతెగాని పోలీసువారికి జాడదిక్కనిది మిగిలియుండలేదని తేలినది-

(హిందు)

——

## దేవీప్రశ్న

# గోలకొండపత్రిక

వృషనామసం॥ శ్రావణ శు॥ ౪

సోమవారము

## శతం దీర్ఘమాయుః

వైదికుల ఆశీర్వచనములో ముఖ్యమైన మంత్రము

" శతమానం భవతి శతాయుః పురుషః
ఇత్యభిగమో భవతి
శతమితి శతం దీర్ఘమాయుః,
... ... శతాత్మానం భవతి
శతే మనంతం భవతి శతమైశ్వర్యం భవతి
శతమితి శతం దీర్ఘమాయుః "

ఇంతకన్న మించిన ఆశీర్వచనము కాన రాదు.

మన మహాఘనత వహించిన నవాబ్ ఉస్మానలీఖాన్ బహద్దరుగారికి మొన్నటి శనివారమునాడు ౫౭ వ సంవత్సరము ముగిసి ౫౮ వ సంవత్సరమారంభమైనది. ఈ సందర్భములో పై వైదిక మంత్రము శ్రీవారికి వర్తించవలెనని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాము.

శ్రీప్రభువులుంగారి జన్మదినము హైదరాబాదు రాష్ట్రవాసులకు పర్వదినము. ఈ సంవత్సర కాలములో మనరాష్ట్రమందు చాలా మార్పులుకలిగెను. మొట్టమొదటిది రానున్న రాజ్యాంగశాసనానికి ఒక సలహాదారు దప్పుడే యేర్పడిపోయెను. రెండవది మన ప్రభువుగారి పూజ్యమాతగారు పరమపదించిరి. వారికి మాదిరెదక్కన్ అని ప్రజాప్రముఖులు ప్రీతిబిరుదమిచ్చిరి. వారిజ్ఞాపకార్థమై హైదరాబాదు నగరములో మసీదొకటి ౧ లక్ష రూపాయీలది నిర్మింపబడనున్నది. అలీఘడ్‌లోను ఒక మసీదు నిర్మించనున్నారు. పైగా హైదరాబాదు రాష్ట్రవాసుల విద్యాసహాయానికిగాను ఏటేట ౫౦౦ రూపాయీల బహుమతులు మాదిరె దక్కన్‌గారి పేర ఏర్పాటుచేసినారు. వారి మృతిదినమునాడు వారిభౌతిక శరీరము వెంట ముసల్మానులేకాక హిందువులును వెళ్ళియుండిరి. దీని వలన హిందూముసల్మాను లప్పుడప్పుడు తప్పుడు మతోద్రిక్తనాయకం మన్యుల మేకపోతు ఆర్భాటాలకులోనై పరస్పరంగా తలలు పగులగొట్టుకొనినను ఉభయవర్గాలవారును ప్రభుకుటుంబమునెడ, మంచి రాజభక్తి కలవారనివిశదమైనది. హిందూ ముసల్మానులు ఒకే శృంఖలము లోని భాగములేఅని శ్రీప్రభువులుంగారు ప్రబోధించిరి.

ఈసంవత్సర కాలములో మన ప్రభువుగారు రెండు ముఖ్యవిషయాలను గురించి అభిప్రాయమును ప్రకటించి యుండిరి. రాజకీయములు వేరని మతము వేరనియు స్పష్టీకరించిరి. తాము మతవిషయములో ఏమైనవ్రాసిన అది వ్యక్తిగతమేఅని మరొకమారు తెల్పిరి. ఇదే కాలములో అధికారులు, మాషుదారులు, బిరుదాంచితులు రాజకీయముల లోపాల్గొన గూడదని ఆజ్ఞ యయ్యెను. అనల్ మలిక్ సిద్ధాంతమును దక్కనీరబ్బరు బుస్సవమును మరింతసాగదీసి ఊపిరి గొద్దియూదినందున అది తప్పున పగిలి పోయెను. అదేదెబ్బతో బాధ్యతాయుత ప్రభుత్వమను దివాస్వప్నము గాలికెగిరి పోయెను. ఇంతలో మన ప్రధానామాత్యులుంగారు వైస్రాయి మంత్రాంగ సభకెక్కిరి.

ఇవి ఈ సంవత్సరకాలములో జరిగిన ముఖ్యఘట్టములు. అన్నియు అందరికినీ తృప్తికలిగించ నేరవనుట ప్రకృతిసిద్ధమైనధర్మమే. ఏదియెట్లున్నను మనకు పూజ్యులును, గౌరవనీయులును, సర్వజనరంజకులును అయిన మ. ఘ. వ. నిజాం ప్రభువుగారియెడ మాత్రము అన్నివర్ణాలవారును, ఆర్యులును, సనాతనులును, హిందువులును, ముసల్మానులును, క్రైస్తవులును, పార్సీలును, రాజులును రాతులును, నవాబులును, రైతులును అందరును ఏకముఖంగా అచంచలమగు రాజభక్తికలవారై యున్నారనుటలో ఏమియు సందేహములేదని గట్టిగా పూని చెప్పగలము. శ్రీవారికి " శతం దీర్ఘమాయుః" అని మరొకమారు ప్రార్థించుచున్నాము.

---

## ఇది నిజమా?

" పాతతావుల క్రింద ఉన్న భూముల సిస్తులో రూపాయకు ౧౦ అణాల రూపాయీల చొప్పున శాశ్వతపు తగ్గింపును ఈమధ్య మ. ఘ. వ. నిజాం ప్రభువర్యులు మంజూరు చేసిరి "

అని "హైదరాబాదు సమాచారము"లో జూలై సంచికలో ప్రకటించినారు. ఇది నిజమేనా? నిజమైతే ఆయాజ్ఞ యెన్నడైనది. ఎచ్చట ప్రకటింపబడి యుండెనో ఆవివరాలను వెంటనే మన ప్రభుత్వ ప్రకటనశాఖవారు స్పష్టముగా వెల్లడిచేసిన రైతులకు చాలా ఉపకారముచేసిన వారగుదురు.

" ప్రభుత్వమువారి సిటిపాయదల క్రింద ఉన్న మాగాణి భూములకు కూడా భూమిసిస్తులో శాశ్వతమగు తగ్గింపు చేయు విషయము ఇప్పుడు ప్రభుత్వమువారి విచారణ లో నున్నది. "

అని పై "సమాచారము" లోనే ప్రకటించినారు.

ఇది సువార్త.

---

## హైదరాబాదునందు కళాశాలాస్థాపనము

(స్వ వి) హైదరాబాదు ౧౯ సహారేవరు ౧౩౫౦ నిన్నటిరోజున ఇక్కడ ఆర్యప్రతినిధి సభ సమావేశములో నిజాంరాష్ట్రమున దు కళాశాల స్థాపించుటకు గురించి పండిత దత్తాత్రేయ ప్రసాదుగారు ప్రవేశపెట్టిన ప్రణాళిక అంగీకరించబడినది. ఈకళాశాలపేరు "దయానందు కళాశాల" ప్రభుత్వమువారి అంగీకారము పొందుటకు ప్రయత్నించుచున్నారు. త్వరగా కళాశాలను ఆరంభింతురు

---

## గోలకొండడైరీ

## వెలువడినది.

అందలివిశేషాలు.

గోలకొండ డైరీ వెలువడినది అందలివిశేషాలను టూకీగా తెలుపుచున్నాము,

మొత్తము పీఠికాపుటలు ౧౩౦
గతసంవత్సరముకన్న ౪౦ పుటలెక్కువ
అంతకొత్తవిషయాలుచాలా చేర్చినాము ఎట్లనగా
జ్ఞాపకార్థము పుటలు ౮
దేశీయసంస్థానాలు
నిజాంరాష్ట్రక్రొత్త జనాభా
(రాష్ట్రవిభజన, మూలకము, టప్పా, జాగీర్లు, సర్ఫెఖాసు, ఇందుకొన్ని మార్పులతో గతసంవత్సరవిషయాలే ఉంచినాము)
పటేలు పట్వారీల స్కేల్లు
వైజ్ఞానిక సృష్టి—క్రొత్తది.
రైతులహక్కులు- రెండంతలకు పైగా పెంచివ్రాయబడినవి. చాలా అవసరమగు విషయాలే చేర్చబడినవి. (జమాబందీ మాఫీలు, భూపరాధీనశాసనము, మహోత్సవాలు పటేలుపట్వారీల విధులు ఇట్టివి చాలా చేర్చినారు.)
రుసుములు స్టాంపు- గతసంవత్సరముకే జాగీర్లలో ఆక్రమపట్టీలు క్రొత్తవిచేర్చినాము. ప్రపంచ విఖ్యాత గ్రంథాలయాలు క్రొత్తభాగము బ్రహ్మాండవిశేషాలు క్రొత్తది. చాలామెచ్చుకైనవిషయము
రైల్వేనియమములు—విజ్ఞానం—క్రొత్తది
హైదరాబాదురాష్ట్ర పత్రికలు—అంతాక్రొత్తదే
విజ్ఞానవిషయాలు_చాలా పెంచివ్రాయబడినది
పంచాంగము—పండుగలు, కార్తులు ౧౩౫౧_౫౨ వరకుగలది,
ఇంకను చాలావిషయాలు వ్రాయబడినవి
ఇదికాక డైరీపుటలు ౪౦౦ ముద్రించినాము. ప్రతిపుటపైన తెలుగుతో పాటుగా ఉర్దూఆంగ్లాలలో కూడా తారీఖులు ముద్రించినాము. తెలంగాణా తెలుగువారికిక ఇంకేమిన్ని అన్వేషణ ఉండనేరదు. పైగాకొన్ని దరఖాస్తు నమూనాలను ఉర్దూలోనే అచ్చువేసి యిందుచేర్పించినాము.
గతసంవత్సరంవలె డైరీలు చేతులపైననే ఎగిరిపోగలవు.
డైరీలు తయారుకాకేదన్నను ఇప్పటికే ౨౫౦ ఆర్డర్లు మావద్ద రిజిష్టరైయున్నవి.
కొందరుపైకొన్ని అడ్వాన్సుగా ఇచ్చిపోయినారు

వెల ౧౪ అణాలు
ఆదరికిన్ని ఒకేవెల
వలయువారు,

మేనేజరు గోలకొండ పత్రిక,
హైదరాబాదు దక్కన్.
అనివ్రాయుడు.

---

## నిజాంరాష్ట్ర ఆర్యప్రతినిధి సభ అధికారుల ఎన్నికలు-

హైదరాబాదు ౧౯ సహారేవరు ౧౩౫౦ ఫ

ఈరోజు పగలు ౧ గంటకు విద్యాలంకార పండిత వినాయకరావు, బారిష్టరుగారి అధిపత్యములో నిజాంరాష్ట్రములోని ఆర్యసమాజ ప్రతినిధులతో సభసమావేశ పరచి ఈక్రింది వారిని అధికారులుగా ఎన్నుకొనిరి

౧. పండిత వినాయకరావుగారు అధ్యక్షులు,
౨ ,, మురళీచందు బి. ఏ.యల్ యల్.బి. గారు ఉపాధ్యక్షులు
౩ , నరేంద్రజీగారు కార్యదర్శులు
౪ ,, ప్రముఖరావుసింగ్ }
౫. ,, డా॥ రఘోత్తమరావు } సంయుక్తకార్యదర్శులు.

---

## ఆహారవస్తుపరీక్ష

హైదరాబాదు (దక్కన్), సహారేవరు ౨౧

హైదరాబాదు ప్రభుత్వమువారు మహబూబు నగరుజిల్లాలోను అలంపూరుతాలూకాలోను జనుల ఆహారపద్ధతిని పరీక్షించినారు. దానివలను ఈ ప్రాంతాలలో పిల్లల పండ్లక స్వలు చెడిపోవుట, ఎముకలుకీళ్ళు జెక్కుము, ఎనపక్కు పెద్దవారిలో చెడిపోవుట సంభవించుటకనబడినది కారణమేమనగా త్రాగుడునీటివలన ఈలోపాలేర్పడిన వి_ముఖ్యంగా యీలోపము కృష్ణా తుంగభద్రానదులమధ్యప్రదేశము లోకనబడినది ఫ్లూరైడ్ అను జాడ్యము ఇచ్చటి ఈనీటివలన విశేషమైనది.

---

## పాల్వంచ సంస్థానము

ఒక వీడ్కోలు

(స్వ వి) ౧౪ సహారేవరు ౧౩౫౦ ఫ

ఇచ్చట సంస్థానపాఠశాలలో పదేండ్లనుండి ఉపాధ్యాయుడుగాపనిచేసి అనేకమంది విద్యార్థులను మైట్రికులకొనిపచ్చినట్టియు, గ్రంథాలయానికి సహాయ కార్యదర్శిగానుండి దానిభవననిర్మాణమునకును, అభివృద్ధికిని త్రికరణశుద్ధిగా సేవచేసినట్టియు శ్రీమాదిరాజు రామమూర్తిగారు కుకునూరునకు మార్పుకాబడిన సందర్భమున గ్రామప్రముఖులు, గ్రంథాలయసభ్యులు, ఉపాధ్యాయులు వారిగౌరవార్థం అల్పాహారముఇనోసంగిరి శ్రీయుత శ్రీ వెం. రా. ల. నా శర్మగారి అధ్యక్షత క్రింద ఒక సమావేశముజరుపబడినది. పాఠశాల ప్రధానోపాధ్యాయులైన మౌల్వీ బ్దుల్ రజాక్ గారు రామమూర్తిగారి విద్యాసేవ, నిరాడంబరత్వము, యోగ్యతాదులగురించినుడివిరి. శ్రీనంద వెంకటరామనరసింహారావుగారు, రామమూర్తిగారు ఉపాధ్యాయులుగాను గ్రంథాలయకార్యదర్శిగాను చేసినకృషిగురించి వివరించుచువారిమార్పుకు గ్రామస్థులెల్ల పరితాపపడుచున్నామని నుడివిరి. తలవనితలంపుగా బ్రహ్మశ్రీ ఉభయభాషాప్రవీణ విశ్వనాథ వెంకటేశ్వరకవిగారిటకుదయచేయుటచే అధ్యక్షునికోర్కెపైన విద్యాశయములు ఆదర్శోపాధ్యాయుని ధర్మములగురించి మహోన్నతభావములతో ప్రసంగించి రామమూర్తిగారినిన్విధముగా గౌరవించుటకుగల యుద్దేశమేమిటో తెలియజెప్పిరి. అధ్యక్షులు, రామమూర్తిగారి ఉపాధ్యాయత్వములో ఓపిక, కార్యదీక్ష, యోగ్యత మున్నగు సుగుణములుండుటచేతనే ఇటులఎల్లరు ప్రశంసించుచున్నారనియు, వీరికృషివలన కుకునూరుగ్రంథాలయముకూడ అభివృద్ధికి రాగలదని యాశించుచున్నామనియు నుడివిరి కృతజ్ఞతాభివందనములతో సభముగింపబడెను.

విశ్వనాధవారి కవితాగోష్ఠి

శ్రీవిశ్వనాధ వెంకటేశ్వరకవిగారిట నాల్గు దినములుండి వారిఖండకావ్యములను వినిపించిరి— ఒకనాడు సాయంకాలము, గ్రామప్రముఖులు, గ్రంథాలయసభ్యులు ఆంధ్ర బ్రాహ్మణ సేవాసమితి సభ్యులు వారినిసన్మానింపదలచి గ్రంథాలయభవనములో సంస్థాన డివిజన్ ఆఫీసుమునకాలంతైన బ్ర. శ్రీ అమరవాది వేంకటప్పయ్యగారి యధ్యక్షత క్రింద సభ చేసిరి. శ్రీనవం వేంకటరామనరసింహారావుగారు, కవిగారిపాండిత్యప్రతిభనుగురించియు, వారినిసన్మానించవలసిన యవసరమునుగూర్చియుమచ్చటించి కవిగారిలకు కవితాప్రదర్శనమును గావింపగోరిరి. కవిగారుసభికులకోర్కెను పురస్కరించుకొని శ్రీవేంకటేశ్వరస్వామి, ఆంజనేయదేవాలయము, శ్రీనిజాం ప్రభువులు, వారురాష్ట్రమునగావించుచున్న మహోపకారములు, సంస్థానాధీశ్వరులు, రాజధానీ నగరనిర్మాణము, ఆశ్వారాయాంధ్రభాషానిలయము మున్నగువిషయములగురించి తమయసదృశధారతోఅగు కవితాప్రదర్శనమునుజరిపి సభ్యులతన్మయులచేసిరి తరువాత గ్రంథాలయావశ్యకత ప్రయోజనములగురించి ఉపన్యసించి సభాసదులను పద్యములతో నాశీర్వదించిరి వారినిసముచితరీతి సన్మానించినపిదప శ్రీనరసింహారావుగారి కృతజ్ఞతాభివందనములతో సభముగింపబడెను

---

## దాదాపురం సంస్థానం

కీ. శే. బుచ్చవ్వదేవిగారు

మ_రా_శ్రీ దోమకొండ రాజాసోదరిబాపుగారి కుమార్తెయు, దూపాడుపేట సంస్థానం సంగారెడ్డిగారి భార్యయు, దాదాపురం పెద్దరాణిగారితల్లియుఅగు శ్రీ బుచ్చవ్వ దేవిగారు వృష సం. ఆషాఢ శు॥ ౧౫ మంగళవారము ఉదయం ౩౪ గంటలకు పరమపదించిరి ఈమెకు బీదసాదలయందుమిక్కిలి అప్యాచేసినయీనా బీదలను ఆదరించునట్టితల్లి చుట్టుపట్లు మూడు నాలుగు గ్రామాలకు కల్పవృక్షము. ఇట్టితల్లిని దైవముతీసుకుపోవుట మా దురదృష్టము

జి సామి, కోస్టి,

---

## మెషీన్ సామానులు

హైదరాబాదు (దక్కన్), సహారేవరు ౧౪

మెషీనులకుప యోగించుసాధనాలను హైదరాబాదురాష్ట్రమునో నుండి బయటికిపంపుటకు తెప్పించుట ప్రభుత్వము వెలప్రకటించి నిషిద్ధమైనది—

---

## భువనగిరి

(స్వ. వి) ౧౩ సహారేవరు ౧౩౫౦ ఫ

దుగ్యాలచంద్రయ్య, మహమద్ యూసఫ్ గారలమధ్య అభియోగము రాసహారేవరు ౧౩ ౫౦ ఫనాడు భువనగిరిమున్సిపుగారు కొట్టివేసిరి అభియుక్తులుతీసుకొనుటకు దుగ్యాలచంద్రయ్యగారు అచ్చుకాగితముపై దరఖాస్తుమున్సఫ్ సిరస్తెదారుయెదుటపెట్టగా, అతడికాఇట్టి దరఖాస్తుపెట్టనేరదనియు, దారుల్‌తబ లో ముద్రితమైన ఫారముపైనదరఖాస్తు పెట్టుకొనవలసినదని య్యాయిచ్చెను, విధిలేకయివరకు ఖరీదుచేసిన రూపైసలునష్టపడుచు, మరలరెండుపైసలు యిచ్చినేరేదరఖాస్తు నకల్ ఫారముఖరీదుచేసి దరఖాస్తుయిచ్చగా దానికిగాను ౦-౬-౦ తీసుకొని, రిజిస్టరులో ౫౯౪ సంఖ్యపైన దరఖాస్తు వ్రాసి, ౧౩సహారేవరునాడు జమకట్టినట్లుగా వ్రాసిరి ఇదివరకుఈసం_౬__౯ తీసుకోవద్దనియెన్నియోగష్టీలు వెడలియున్నను. క్రిందిఅధికారులు పట్టించి విర్లక్ష్యముగామాచుటచే బీదలకుచాలనష్టముకలుగుచున్నది. ఎన్నియోసార్లు స్థానికపత్రికలలో ఈయిబ్బందినిగురించి అనేకులు వ్రాసుకున్నను వికేవారెవ్వరులేనట్లుగా తెలియుచున్నది—

మార్కెటింగు అధికారుల నిర్బంధము

౧౯సహారేవరు ౧౩౫౦ఫ

గోలకొండ సంపుటముగణ, సంచిక ౫లో "మార్కెటులో కార్మికులకులైసెన్సు నిర్బంధము పనివారలఆగ్రహము" అనుశీర్షికతో స్వకీయవిలేఖరివ్రాసినారు_ కార్మికులనే నిర్బంధించుటలేదు ప్రతిదుకాణదారునితోను, దుకాణములేనివారితోను భువనగిరిగంజులోవచ్చి బీటుఅప్పుడుసరుకుపైన బీటుచేయువారికందరికి రు॥ ౧౦ పదిరూపాయీలు యిచ్చి లైసెన్సుపొందితేనేకాని బీటులోపాల్గొనుటకు అధికారముండదని తెలిపినారు ఏదోఒకయూరినుండి పదిపుట్లబెల్లం కావల్సినా, లేకపుల్లిగడ్డ చింతపండు అవసరముతిండి ఖరీదుచేసుకుటకు భువనగిరివచ్చి గంజులోఖరీదుచేయవలెనన్నా ముందుపదిరూపాయీలుయిచ్చి లైసెన్సుపొందితేనేకాని సరకుదొరకదు. లేకయెవ్వరైనా లైసెన్సుపొందినవానికి కమీషన్‌యిచ్చి సరకుఖరీదు చేసుకొనవచ్చును, ఒకరైతుకన్ను ఖరీదుచేయవలెనన్నయుంటే, ఈపదిరూపాయిలు యిచ్చిలైసెన్సుతీసుకోన్న దానిలో అడుకోవలసిదా రునిపేరువెంబడి. సాహేబుఅనుమతము వ్రాయుటలేదు ఇట్లుసాహేబుఅనుమతము వ్రాయకుండుటవలన మానవప్తముఅభియోగము వ్రాసినవారిమైనను మరియుమార్కెటింగు అధికారిపైనతేవచ్చును. ఈవిషయమున వ్యవసాయశాఖవారు కట్టుదిట్టమైన ఆజ్ఞలుపంపినను క్రిందిఅధికారులు నిర్లక్ష్యముగాచూచుచున్నారు. ఉదాహరణార్థము ఒకలైసెన్సుపత్రం ఇట్లున్నది_ "ముసల్మానయెడెల్లి శ్రీశైలం వల్లుబుచ్చయ్య సాకీముభోనగిరు. దరఖాస్తుగ౫అజారు ౧౩౫౦నుండి అజార్‌పూర్తివరకు వర్తకుడుగాపనిచేయుటకు అనుజ్ఞయిస్తారు ౧౦పదిరూపాయిలు. లైసెన్సుఫీజాగా మాకు ముట్టినవి"

ఇందులోయెడెల్లి శ్రీశైలంగారు అనుమాట లేదు_ ఈవిషయముఅధికారులు గమనించదగినవిషయమే_ నలుమొకవిషయము ఈలైసెన్సులో కొలాయుదుగాని ఖానూన్‌గాని చూపబడలేదు!

## రాజీనామా వాపసు

ఖమ్మం, ౧౬__౧౧—౫౦ ఫ

నీలూర్కు ఆంధ్రమహాసభ ఆంధ్రపదనిర్వచనము మార్చినందుకుఅసమ్మతిచేవరంగల్ జిల్లాఆంధ్రజనసంఘకార్యనిర్వాహక సభ్యత్వమునకు రాజీనామాయిచ్చియుంటిని అదిపత్రికలో ప్రకటింపబడెను నారాజీనామాగురించినామిత్రులుకొందరు సంతసించుచు, కొందరు సభ్యత్వమును వదలక సంఘము లోనుండియేయుమభావములను ఆంధ్రులలో ప్రచారము చేయవలయునని కోరుచు లేఖలు వాయుచున్నారు, ముఖ్యముగా గోలకొండపత్రిక ఆదేశానుసారము నారాజీనామాను వాపసుతీసికొనుచున్నాను. శాశమూల్యమగు సలహాలనిచ్చిన గోలకొండపత్రికాధిపతిగారికిని మిత్రులకును నేనెంతయో కృతజ్ఞత తెలుపుచున్నాను రాజీనామాను వాపసుతీసికొనినంతమాత్రమున నాఅభిప్రాయములోయేమియుమార్పులేదు. ఆంధ్రపదనిర్వచనముమార్పించుటకు ప్రయత్నించుటకే తిర్గి సంఘము గోచేరుచున్నాను. నాఅభిప్రాయమును స్పష్టముగాప్రకటించవలయువనిమిత్రులకోరుచున్నారు ప్రస్తుతముదీర్ఘమైనప్రకటన అనవసరము భావికార్యక్రమమేమో ఆనినిర్ణయించుకొనవలసియున్నది దానికొరకే మిత్రులతో ఆలోచనలు జరుగుచున్నవి కొంతకాలము క్రియాత్మకముగా ఆంధ్రమాతలకు నామనవియిదే! మీరందరుఓపికతో నాముందు కార్యవిధానమున కెదురుచూచుచు దానిని ధైర్యముతో ఆంధ్రులలో తీవ్రప్రచారము చేయుగలరని విశ్వసించుచున్నాను.

చావా వెంకటకోటయ్య

# వైస్రాయిగారి క్రొత్త మంత్రివర్గము

## ఏపక్షానికిని తృప్తికరంకాలేదు

### అతివాదులు మితవాదులుకూడ ఆక్షేపించుట

వైస్రాయిగారి క్రొత్త మంత్రివర్గమునుగూర్చి అతివాదులేకాకుండా మితవాదులుకూడా ఆక్షేపణలను తెలిపినారు.

**గాంధిమహాత్ముని అభిప్రాయము**

గాంధిమహాత్ముడు ఈక్రిందివిధముగా అభిప్రాయమిచ్చినాడు "ఈప్రకటనకాంగ్రెసు వైఖరిలో ఎట్టిమార్పును కలిగించజాలదు. అది కాంగ్రెసుకోరినకోర్కెను తీర్చజాలదు" ఈ క్రొత్త ప్రకటనను దృష్టిలోనుంచుకొని దేశపరిస్థితినిగురించి ఆలోచించుటకై ఆఖిలభారతకాంగ్రెసు పరిషత్తుసభ్యులను వదలిపెట్టవలెనాయని ఒకవిలేఖరి గాంధిమహాత్మునడుగగా వారిట్లుచెప్పిరి "అఖిలభారత కాంగ్రెసు పరిషత్తుసభ్యులు తాముచేయదలచినదానిని చేయకుండ ఆటంకపరచుటకు నాకు అధికారము ఏదిగానిలేదని నేను వెంటనేచెప్పగలను. అఖిలభారత కాంగ్రెసు పరిషత్తువారు నాకిచ్చిన అధికారముతో నేను దానిసభ్యులకుండే సంపూర్ణస్వాతంత్ర్యమునకు అడ్డుతగలలేను. ఏది ఏట్లయినను నాకుఅధికారమిచ్చినవారలు ఎప్పుడుగాని ఆఅధికారమును ఇవ్వనిరాకరించుటకును, ఇచ్చినదానిని ఉపసంహరించుకొనుటకునుగూడ సమర్థులే."

**జిన్నాగారి విషాదము, బెదరింపు**

జిన్నాగారు ఈక్రిందిఅభిప్రాయము నిచ్చినారు:—

"వైస్రాయిగారి మంత్రివర్గమును పెద్దదిచేయు విషయంలోను, జాతీయరక్షణసంఘమును స్థాపించువిషయంలోను అయిననిర్ణయమును ప్రకటించుటయన్నది చాలావిషాదమును కలిగించునది—ముసల్మాను భారతదేశమునుండి మనఃపూర్వకమైన, సంతోషముతో చేసే సహకారమును నిష్కపటముగా అపేక్షించియుండినచో అది ఈపద్ధతిలో లభించదు—అందుకు ఒకటే కారణము: వైస్రాయిగారిచే గ్రహించబడినవారలు నిజమైన ప్రజాప్రతినిధులైనను కాదు, లేదా ముసల్మానుల విశ్వాసమునకు అర్హులైనను కారు.

వైస్రాయిగారి తెలివి వారిని ఒకతప్పునుండి మరియొకతప్పునకు తీసికొనిపోవుచున్నది—ఇది చాలాదురదృష్టకరమైనవిషయము. మరియు వైస్రాయిగారు ముస్లింలీగునాయకుని, కార్యవర్గమునుకూడ అడుగక ముస్లింలీగుసభ్యుల సహకారముపొందుటకై యత్నించుట మనస్సుకు చాలకష్టము కలిగించినది—లీగుసభ్యులు కొందరు ఈ ఆకర్షణలకు లొంగిపోవుట అంతకంటె కష్టము కలిగించినది—

వైస్రాయిగారు తాము ఇచ్చేదానిని పోయిన ఆగస్టులో తెలిపినపుడు అదిముస్లింలీగుకు సమ్మతమైయుండలేదు. దానికపుడుఒక్కటే అప్రతిహతమైనకారణము చూపబడెను—అదిఏమనగా వైస్రాయిగారు చెప్పినదానివల్ల ముస్లింలీగుప్రతినిధులకు ప్రభుత్వాధికారమందు నిజమైనభాగము లభించునట్లులేకుండెను వెనుకటికంటెను ఇప్పటి తీర్మానము ముస్లింభారతదేశముయొక్క ఆమోదమును, సహకారమును బడయునని ఎవరుగాని ఎట్లుకోరగలరు? ముస్లింలీగు మంత్రులును కొందరు ముస్లింలీగుసభ్యులును అసంస్థయొక్క నాయకునిగాని, కార్యవర్గమునుగాని అడుగకుండానే, వారలకు తెలియకుండానే ఈక్రొత్తవిధానములోచేరినారు. వారలసేవలనుపొంది ముస్లింలీగులో ద్రోహులను సృష్టించగలిగినందుకు వైస్రాయిగారిని నేనుఅభినందించుచున్నాను. దీనివల్ల ముస్లింలీగు తనప్రకటితమైన విధానమునుండి ఏమాత్రముతొలగిపోదు ఈకుట్రలు ప్రభుత్వమునకుఏమాత్రము సహాయముచేయజాలవు. అందుకుమారుగా, ఇప్పటిప్రకటనచేయుటకు ప్రభుత్వమువారు ఈ విషయంలో అవలంబించుచుండిన విధానమును మేమెంతతీవ్రముగా ఆక్షేపించుచుండినను అప్పుడు లేకుండినట్టిద్వేషము ఇపుడుపుట్టగలదు. కమ్యూనిక్కులో ప్రకటించునట్టి వైస్రాయిగారి మంత్రివర్గవిస్తరణలోను, జాతీయరక్షణ వర్గస్థాపనలోను లీగుకార్యవర్గముయొక్క అనుమతిపొందక, దానికి తెలియకుండానే చేరినట్టి లీగుసభ్యులయొక్కయు, ముస్లిం లీగు ప్రధానయొక్కయు చర్యమునడవడినిగూర్చి సావకాశమైనంతత్వరలో ఆలోచించి తగుచర్య గైకొనవలసియుండును"

**రైట్-ఆనరబుల్-శ్రీనివాసశాస్త్రిగారి అభిప్రాయము**

రైట్-ఆనరబుల్- శ్రీనివాసశాస్త్రిగారు ఈక్రిందిఅభిప్రాయమునిచ్చినారు- "ఈప్రకటనఏమి మేలుచేయునో నాకుకనిపించుటలేదు పూనామహాసభకు అతిక్రమించునట్లు చేయుచున్నది- ఆమహాసభ ఆప్రకటనను పూర్తిగానిరసించగలదు-ప్రభుత్వమువారు తమస్థితిని బలపరచుకొనలేదు. ప్రజలకోరికలను కొంచమైనను తీర్చలేదు."

—

## వేరుసెనగ గిరాకిహెచ్చుట

### బ్రిటిషువారికి అవసరమగుటవల్ల

మద్రాసు, జులై 18

బ్రిటిషు ప్రభుత్వముయొక్క ఆహారశాఖవారు పోయినవారంలో ఇచ్చెదమనిచెప్పిన ఎక్కువధరకు అప్పటికి నిలవయుండు వేరుసెనగను కొనలేకపోవుటవల్ల ఈసారిదానిధరను 10 పౌనుల 10 షిలింగులనుండి 11 పౌనులకు హెచ్చించినారు, అందుచే ఇక్కడ వేరుసెనగధర 30 రూపాయలకుపెరిగినది. అమ్మేవారలు ఇంకను పట్టుదలకబిగించుకొనియున్నారు.

—

## రాంపురం

### పోశమ్మ పండుగ

(ఒకవిలేఖరి) ౧౫-౧౧-౧౩౫౦ఫ.

రాంపురంఅనేగ్రామము మహబూబునగరం తాలూకాలో కొయిలకొండచేరువనున్నది- ఇచ్చట ప్రజలకు ప్రతిసంవత్సరం పోశమ్మకు బోనాలుతీసుక వెళ్లుఅలవాటుకలదు. ఈసంవత్సరంగూడ పోశమ్మకుబోనాలుతీసుకవెళ్లేందుకు ప్రజలలో కొందకలిగి సుమారు ౫దినములక్రిందట గ్రామంలోచాటించినారు- సామాన్యముగా పోశమ్మబోనాలకొరకై ప్రతిఇంటికి ఒకకోడిపుంజు కావలసినది- ఇట్లుజీవహింసపండుగను అపుకలచేయవలసినదని ఏ-బి-రెడ్డిగారు ప్రజలకుహితబోధచేసిరి- మరియుహన్మరెడ్డిగారు గ్రామంలో ఈసంవత్సరం బోనాలుపోశమ్మకు వెళ్ళగూడదని చాటించిరి- కొందరుయిట్టిపండుగ పూర్వము పెద్దలనుండిజరుగుచువచ్చినదనియు, యిప్పుడుమానివేసినచో ఆపోశమ్మకు కోపమువచ్చి తమపిల్లలనుయెల్లప్పుడు కష్టములపాలుచేయునని యు భృశమ్మకనుగల్పినారలైనందున వారందరుఏకమై పోలీసుపటేలుతో మొరలిడుకొని వారిఆనుజ్ఞచే యీసంవత్సరంగూడ పండుగను యథావిధిగజరిపిరి-

**రాత్రియువజన పాఠశాల**

ఇక్కడ ఒకరాత్రియువజనపాఠశాల సుమారు ౫నెలలక్రిందట తెరువబడి రెండుమాసములర్యంతము యేమియుఅటంకములేకుండజరిగెను- ఇట్టిబడికి శ్రీమాన్ జి- హేమారెడ్డి ఉపాధ్యాయులుగాఏర్పడి మంచిగాపాఠశాలను నడుపుచుండిరి కానిఒకగుమాస్తాపటేలు యిట్టిబడినిఏలాగైనను ఆపివేయవలెనని ఉపాధ్యాయులవారుచిన్నాయనయగు శ్రీమాన్ జి- ఎల్లారెడ్డిగారితో యేమేమియోలేనిపోనిమాటలుచెప్పి ఉపాధ్యాయులను బడికిరాకుండజేసిరి- అందువల్లబడిరెండుమాసములనుండి ఆపివేయబడెను- తిరుపతి హన్మంతరెడ్డిగారికొమారుడైన రాంరెడ్డిగారు ఉపాధ్యాయులుగాఏర్పరుపబడి మరలప్రారంభించినారు- ఇప్పుడుపిల్లలసంఖ్య ౩౦వున్నది- గ్రామవాసులు ఇట్టికార్యమునకు డబ్బుశక్తికొలదియివ్వగలరని నుడివినారు-

—

## ముగ్గురు పిల్లలొకేసారి పుట్టుట

(విలేఖరి)

సదాశివపేటకు (౯) మైళ్ళదూరమునయున్న బుధవారకలను గ్రామములో మన్నె సంగప్పగారి యింటియందు యీ ౧౬-౧౧-౫౦ తేదిన రొుక స్త్రీ ప్రసవించి ముగ్గురిపిల్లలను ఏకముహూర్తమునకనెను. అందులో ౧ మగపిల్లవాడు ౨ ఆడుపిల్లలు మరునాడు ఉదయం ౧ మగపిల్లవాడు గతించెను మిగతపిల్లలును, తల్లియు క్షేమంగయున్నారు

—

## కీ. శే. మల్లాది రామకృష్ణ చయనులు

బెజవాడ ౨౩

ఆంధ్రదేశములో గొప్పపండితులని ప్రసిద్ధిగాంచిన బ్రహ్మశ్రీ మల్లాది రామకృష్ణవిద్వచ్చయనులుగారు తమ ౭౯వయేట బెజవాడలో నేటిఉదయము ౯ గంటలకు స్వగృహమందు మరణించిరి వీరుయజ్ఞముల చేసినవారు, సంస్కృతాంధ్రహిందీభాషలలో శక్తులు వారిశాస్త్రపండితులు, తార్కికుడు వేదాంతవేత్త వీరు చిన్న ఖమ్మంమెట్టు నుండివచ్చి కొలదివిరేచనములతో బాధపడి మరణించిరి.

—

నమ్మదగు పుష్టికారక లేహ్యము

సకలవిధ అశక్తులను, బలహీనతను నశింపజేయును.

అమీరీ జీవన్ (రిజిష్టర్డ్)

బాగుగ పరీక్షింపబడినది. జ్ఞానతంతువులు క్షీణించుట. ధాతుక్షయము దగ్గు మొదలగువవి నాశముజేసి రక్తవృద్ధిజేయును. క్షీణదశకు వచ్చినశరీరమునకు నవీనశక్తి కలుగజేయును.

ఉంఝూ ఫార్మసీ: { గాంధిరోడ్, అహమ్మదాబాద్, బొంబాయి నెం. 2, పూనా, మరియు ఉంఝూ.

ఏజంట్లు-బి. ప్రాణజీవన్ వ్యాసు అండుకో, 3199 పాతజైలురోడు శికింద్రాబాదు.

Musthafa  బ్రాంచి, నిజామాబాదు.

ఈశ్వర్సు గనోక్యొల్

సెగవ్యాధివలన యింతకాలము అనవసరముగ బాధపడియుండ నక్కరలేదు."గనోక్యొల్" 24 గంటలలో రక్తమునందుయున్న క్రిమినిచంపి వ్యాధిని అరికట్టును నకలుమందులనువాడవద్దు. సెగనుపుట్టించుక్రిమినిపోగొట్టుశక్తిలేని మందులవలన ఉపయోగములేదు. గనోక్యొల్ యందు900/0క్రిమిసంహారకశక్తికలదు- దీనినిసేవించినవెంటనే మంటలగ్గ్రణమువిండు చీముపట్టుటనిలచి ఎక్కువసుఖమునిచ్చును- ఇతరావస్థలకు లోబడినకేసులలో సహితము ఇదినదుర్చును- సెగ కఠినమైనదైనను స్త్రీలకైనను, పురుషులకైనను గనోక్యొల్ తప్పక గుణపరచును- రిజిష్టర్డైనదిగాన ఈశ్వర్సు గనోక్యొల్ మాత్రమే కొనుడు- సీసా 1కి వెల 2-8 0

ఈశ్వర ఫార్మసి 172 గోవిందప్ప నాయకవీధి మద్రాసు.

బ్రాంచిలు- { ఈశ్వర ఫార్మసి, 3168 రంగ్సవే సికింద్రాబాద్

SAHARA
CHEAP
MADE IN U.S.A.
SAHARA
CHEAP

5 అణాలకు 10

హిందూదేశపు యువకులారా…

ఒక వృత్తి నేర్చుకొనండి

ఇది మీ యొక్కబ మాకు ఎక్కువగా లాభంమువచ్చే గదండ …

హిందూ దేశము యొక్క పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడుము

నిపుణతగల టెక్నీషియనులు ఇప్పుడేగాకుండ ఆర్థిక మాంద్యముగల కాలములోగూడ ఎక్కువగా పనికికావలసియుందురు, ఎప్పటికికావలసియుండు ఈపనివారలలో నీవుకూడ ఒకపనివాడవైయుండుము. గవర్నమెంటుయొక్క టెక్నికల్ ట్రయినింగ్ స్కీము క్రింద చేర్చుకొనబడడమునకు ఇపుడే దరఖాస్తుపెట్టుము ఈస్కీమునందు ఇందువలన నీకు ఒకసంవత్సరమునకు మించనికాలమువరకు తీవ్రమైన ట్రయినింగు (తరబీయతు) మొట్టమొదట ఇచ్చెదరు. ఈట్రయినింగు అయిన పిమ్మట ఒక వృత్తిసంబంధమైన పరీక్షను నీవుఇవ్వవలెను. ఆపరీక్ష ప్యాసయినపిమ్మట పరిశ్రమ శాఖలలో అనగా డిఫెన్సుసర్వీసులు, ఆర్డినాన్సు, మందుగుండు సామానులు తయారుచేయుఫ్యాక్టరీలలోను, లేక సివిల్ ఇండస్ట్రీస్, మొదలగువాటియందు మీకు ఉద్యోగములు ఇవ్వబడును.

హిందూదేశపు పరిశ్రమను అభివృద్ధిచేయుటకు సహాయముచేయుడు

నీవు స్వలాభమును పొందుటకేగాకుండ నీమాతృదేశమునకు విలువయైన మిక్కిలి గొప్ప సేవచేయుటకుకూడ ఇదియేనీకు మంచిఅవకాశము ఇందువలన యుద్ధములో శత్రువులన్న ఓడించుటకేగాకుండ పరిశ్రమలవిషయములో ఇండియాదేశము అభివృద్ధి పొందుటకుగూడ సరాసరిగా నీవు తోడ్పడినవాడవగుదువు.

గవర్నమెంటు ఖర్చుపైన పనిని నేర్చుకొనండి

సాధారణముగా వృత్తిని నేర్చుకొనుటకు మీరు డబ్బుఖర్చుపెట్టవలెను. కాని ఈ స్కీముక్రింద గవర్నమెంటు మీకు ఉచితముగా పనిని నేర్పడమేగాకుండా పనిని నేర్చుకాలములో నెలకు20రూ॥నుండి 25రూ॥వరకుజీతముకూడా ఇస్తారు మీరుచేయవలసిన దేమనగా మీపేరును, పైవిలాసమును ఒకపోస్టుకార్డుమీద వ్రాసి మీచెంతనున్న నేషనల్ సర్వీసు లేబరు ట్రిబ్యునల్ వారికిపంపవలెను పంపిన రొుదల మీకు పూర్తివివరములు పంపబడును. (యీసంస్థయొక్క ఆఫీసులు:- కలకత్తా, మదరాసు, బొంబాయి, నాగపూర్, పాట్నా, కాన్పూరు, షిలాంగు, లాహోరు. కరాచీలయందుగలవు,)

తక్షణమే దరఖాస్తు పెట్టుకొనండి!

కంబైన్డు టికెట్లు యిచ్చుట

హైద్రాబాదు బి. జి. మరియు సికింద్రాబాదులనుండి బల్హార్షా ద్వారా జి. ఐ. పి. రైల్వేలోని స్టేషనులకు గ్రాండ్ట్రంక్ ఎక్స్ప్రెస్‌బండిలో ఇంటర్‌మీడియేటు తరగతిలో ప్రయాణముచేయువారలకు, ౩వ తరగతి మరియు ఇంటర్‌మీడియేటు తరగతి కలసిన టికెట్లు 1వ తేది ఆగస్టు 1941 నుండి ఇవ్వబడును.

టికెట్లు చార్జీలు ఆయాతరగతులలో ప్రయాణముచేసినంతవరకే తరగతులవారిగా చార్జీయున్న మరియు మామూలుగా ఎక్కువచేయబడిన చార్జీలును కలసియుండును.

ఈటికెట్లులమీద మధ్యలో ప్రయాణము ఆపుట మామూలుషరతుల ప్రకారమే అంగీకరింపబడును-

ఈటికెట్టులు 31 జులై 1941 వరకే ఇవ్వబడును.

ఈటికెట్లు ఉన్నవారలకు ఒక్కొక్క టికెట్టుకు ఒకపూర్తిప్రయాణమునకు 30 శేర్లబరువుగల సామాను ఉచితముగా తీసికొనిపోవచ్చును

ఇతర విషయములకు-

మీదగ్గరి స్టేషనుమాస్టరు

చీఫ్‌కమర్షియలు మేనేజర్, సికింద్రాబాదు.

# మారణ యంత్రాలు వాటి వ్యయము

ఈయుద్ధములో అనేకవిధములైనవ రికరాలు ప్రయోగింపబడుచున్నవి. ఒక అణానుండి ౧౦కోట్ల రూపాయీలవరకు వ్యయమయ్యేసాధనాలు వాడబడుచున్నవి. అందిక్రిందివిముఖ్యముగా గమనింపవలెను.

| | | |
|---|---|---|
| ఒకతుపాకితోట | కు | ఒక అణా |
| ఇసుకసంచి | ,, | ౨ ,, |
| పిస్తోల్ | ,, | ౫౦ రూ॥ |
| రైఫిల్ (తుపాకి) | ,, | ౧౦౦ ,, |
| మెషీన్గన్ (తుపాకి) | ,, | ౧౫౦౦ ,, |
| ట్యాంక్ చెలాన్ | ,, | ౧౦౦౦౦ ,, |
| ఆంటీఎయిర్ క్రాఫ్టుగన్ (విమానధ్వంసకశక్తి) | ,, | ౪౦౦౦౦ ,, |
| ఫైటర్ ఎయిర్ క్రాఫ్టు (యుద్ధవిమానము) | ,, | ౧౪౦౦౦౦ ,, |
| బాంబర్ ఎయిర్ క్రాఫ్టు (ముఖ్యంగా బాంబులు వేయువిమానము) | , | ౨౪౦౦౦౦ ,, |
| డిస్ట్రాయర్ (నావ) | ,, | ౬౦ లక్షలు |
| క్రూయిజర్ [నావ] | | ౨ కోట్ల ౫౦ లక్షలు |
| బ్యాటిల్ షిప్ (యుద్ధనావ | | ౧౦ కోట్ల ౫౦ లక్షలు |

ప్రజలుఇచ్చుచందాలు పైవాటిసహాయానికి వినియోగింపబడును. ఇంగ్లీషునావలు ఇండియాను రక్షించుచున్నవి. ఇంగ్లీషువిమానాలు శత్రువులను విజృంభించకుండా అణచివేయుచున్నవి. ఎంతయిచ్చినను మంచిసహాయమే.

### అఫ్రికాలోయుద్ధము

ఆఫ్రికాలో టోబ్రుకరంగమందు మాత్రము బ్రిటిషుసేనలుకొన్ని జూలై ౧౭ వతేదిన టోబ్రుకు విడిచిపోయి కొందరు జర్మనుసైనికులను ఖైదు చేసికొనివచ్చిరి. జూలై ౧౫ వతేదిన బ్రిటిషుసేనలు టోబ్రుకుకడ్డ జర్మనుసేనలు ఏర్పరచుకొన్న రక్షణలలోకి ౬౦౦ గజములలోనికి చొచ్చుకొనిపోయి శత్రుసేన పై దెబ్బ వేసి చాలమందిని నాశనముచేసినవి. ఇంతకుమించి విశేషములేవియులేవు బ్రిటిషువిమానాలు సిసిలీలో మెసినావిమీదను, డెర్నా, బార్డియా, బెంఘాజీ, గోండరులమీదను జూలై ౧౪ వతేదిన బాంబులను వేసినవి.

జూలై ౧౭ వతేదిరాత్రి చాలాకొద్దిజర్మనువిమానములు బ్రిటను పైఎగిరెను. అవివేసినబాంబులవల్ల గొప్పనష్టమేదియుకలుగలేదు–౧౭ వతేదిఉదయము బ్రిటనుదక్షిణ సముద్రతీరమున కాపలాబ్రిటిషువిమానాలు ఒకజర్మనువిమానమును క్రిందకూల్చెను ౧౭ వతేదిరాత్రికూడ ఇంగ్లాండుపై పెద్దజర్మనుదాడిజరుగలేదు. ఇంగ్లాండుఈశాన్య భాగమందు ఒకపట్టణముపైమాత్రము తీక్ష్ణమైనదాడి జరిగెను అక్కడచాలమంది బాంబుదెబ్బలచే మరణించియుండవచ్చునని భయమగుచున్నది జూలై ౧౮ వతేదిరాత్రికూడ కొద్దిదాడుజరిగెను రెండు జర్మనువిమానములు క్రిందకూల్చబడెను. ఒకరైలుబండిపై జర్మనువిమానాలు మరతుపాకులనుపేల్చగా ముగ్గురికిగాయాలయ్యెను ౧౯ వతేదిమధ్యాహ్నము రెండుజర్మనువిమానములు నాశముచేయబడెను. ౧౯ వతేదిరాత్రి తూర్పుఇంగ్లాండుపై దాడిజరిగెను. ఒకసముద్రతీరస్థపట్టణముపై వేసిన బాంబులచే కొంచెముఎక్కువ నష్టముకలిగెను ౧౯౪౧ జనవరి మొదలు కొని జూను ఆఖరువరకు బ్రిటను పై జర్మనువిమానాలు వేసినబాంబులవల్లను, మరతుపాకులగుండ్లవల్లను దాదాపు ౪౧౯౦౦ మందిమరణించిరి, ౫౨౭౫ మంది గాయపడి ఆసుపత్రిలో చేర్చబడిరి

### జర్మనీప్రదేశాలపై బ్రిటిషు విమానాల దాడులు

ప్రతిరోజూ రాత్రి, పగలుకూడ బ్రిటిషువిమానాలు జర్మనుప్రదేశాలపైనను సముద్రంపైప్రయాణముచేయు జర్మనునౌకలపైనను తిరిగిబాంబులనువేయుచునేయున్నవి జూలై ౧౩ వతేదిరాత్రి పశ్చిమాఫ్రీకాయుద్ధ దీవుల కళిముఖంగా సముద్రంలో కొన్నిజర్మనునౌకలపై బ్రిటిషువిమానాలు బాంబులువేసెను, తమపైకివచ్చిన ఒకజర్మనువిమానమునుక్రిందకూల్చెను. వాయవ్యజర్మనీలో పరిశ్రమస్థానాలపైనను, ఉత్తరఫ్రాన్సులో విమానాశ్రయాలపైనను బాంబులువేయబడెను. ఈదాడుల నుండి ఒకబ్రిటిషువిమానము తిరిగిరాలేదు, ౧౪ వతేదిపగలు ఫ్రాన్సులోహెజెబ్రూర్క్, లీహార్, హేజెబ్రూక్ అనుచోట్లలో ఓడలస్థానాలపై బాంబులువేయబడినవి ౭జర్మనువిమానాలు క్రిందకూల్చబడెను. ౪బ్రిటిషువిమానాలు క్రిందకూలిపోయెను. ౧౪ వతేదిరాత్రి పడమటిజర్మనీ, వాయవ్యజర్మనీలలో పరిశ్రమస్థలాలపై బాంబులువేయబడినందువల్ల చాలనష్టముకలిగెను, ఈదాడినుండి ౫బ్రిటిషువిమానముల జాడతెలియుటలేదు ఒకజర్మనువిమానము క్రిందకూల్చివేయబడెను ౧౫ వతేదిరాత్రి గ్రీసుమీదను, క్రీటుమీదను బ్రిటిషువిమానాలు శత్రువిమానాశ్రయాలపై బాంబులనువేసెను– అదేరాత్రి మెసినాలో ఓడరేవులపై బాంబులనువేసెను– ఈదాడులనుండి రెండుబ్రిటిషువిమానాలజాడ తెలియుటలేదు– ౧౬ వతేదిఉదయము ట్రిపొలిఓడరేవుదగ్గర శత్రునౌకలపై బ్రిటిషుబాంబులు వేయబడుటచే రెండుఓడలు పూర్తిగానాశమయ్యెను, ఒకటికొద్దిదెబ్బతినెను– జూలై౧౬ వతేదిపగలు రోటర్డాంవద్ద౧౭ జర్మనుఓడలు బ్రిటిషుబాంబులదెబ్బచే అక్కరకురానివిగచేయబడెను– ఈదాడినుండి ౪బ్రిటిషువిమానాలుతిరిగిరాలేదు– ఆరాత్రిఇంగ్లీషునావలులో ఒకజర్మననౌక అందులోఉండే సిబ్బందిలోనే సహా ముంచివేయబడెను– జర్మనుసామగ్రినౌకలు రెండుముంచి వేయబడెను– వాయవ్యజర్మనీలో అనేకస్థానాలపై బాంబులువేయబడెను– మొత్తంమీద ఆరోజంతయుకలిసి ౯జర్మనువిమానాలను బ్రిటిషువారుఈదాడిలో నాశముచేసిరి, బ్రిటిషువారివి ౬విమానాలునాశము చేయబడినవి– ౧౭ వతేదిరాత్రి పశ్చిమజర్మనీపై బ్రిటిషువిమానాలు దాడిచేసినవి–

## బరోడాసంస్థానపు ఆదాయవ్యయముల అంచనా

౧౯౪౧-౪౨ వ సంవత్సరములో బరోడా సంస్థానంవారికి వ్యయప్రపస్తుతంటే ఆదాయము రూ ౫౩౭౦౦౦ లు యెక్కువయగునని అంచనా కట్టబడినది. ఈఎక్కువమొత్తమున్ను, ఋణముల పద్దుక్రిందవచ్చేదానిలో చాలాభాగమున్ను (౨౩ లక్షల ౨౬ వేలరూపాయలు) రైల్వేలు, సాగుబడిప్రాజక్టులు, ఎలెక్ట్రిక్ నిర్మాణములు మున్నగువాటికిని (౧౨లక్షల ౧౬ వేల రూపాయలు), గృహపరిశ్రమలు, పెద్దపరిశ్రమలకును (౧౦ లక్షల ౫ వేలరూపాయలు), బావులుత్రవ్వించుకొనుటకై వ్యవసాయకులకును, గ్రామపునర్నిర్మాణార్థమై స్థానికస్వపరిపాలన సంస్థలకును (రూ ౧౫౦౦౦౦ లు) వ్యయముచేయబడును

మొత్తము రూ ౨౫౫లక్షల 3 వేలఆదాయము రావచ్చుననియు, రూ ౨౪౯ లక్షల ౬౫వే ల వ్యయము కావచ్చుననియు అంచనా వేయబడినది వ్యయంలో జరుగుచున్న సంవత్సరంలో అయినఖర్చుకంటే రూ ౧౨౦౦౦౦ లు ఎక్కువఖర్చుచేయుటకు నిర్ణయించబడినది వైద్య, ఆరోగ్యశాఖకు రూ ౧౪౯౦౦౦ లు అదనముగా ఇచ్చుటకు నిర్ణయమైనది. వ్యవసాయశాఖకు రూ ౫౦౦౦౦ లు అదనముగా ఇచ్చుట కేర్పాటయినది. యుద్ధానికై సహాయంగా ఇచ్చుటకు రూ౬౦౦౦౦౦ లు ప్రత్యేకించబడినవి.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

Volume 16 | Hyderabad-Dn | Monday 28th July 1941 | Number 25




## ఆజిల్లాలనుండి అనావృష్టి వార్తలు

### పైరులు లేవు, మేత లేదు, నీరు లేదు

ధరలుకూడ హెచ్చి ఉన్నందువల్ల రైతులు అల్లాడుట

మాకు నల్లగొండ, కరీంనగరము మహబూబు నగరము, నిజామాబాదు, మెదకు, వరంగల్లు, అత్రాఫుబల్దా జిల్లాలనుండి అనావృష్టి ఫలితములచే రైతులు, పశువులు అల్లాడుచున్నట్లు దీనములైన వార్తలు వచ్చినవి

నల్లగొండ జిల్లాలో భువనగిరి తాలూకాలోని అక్కవరం, అచుట్టుముట్టు గ్రామాలలోను జనగామ తాలూకాలోని జనగామ, దానిచుట్టుముట్టు గ్రామాలలోను, గుడి మల్కాపురంలోను కరీంనగరం జిల్లాలో సిరిసిల్ల తాలూకాలోని తడకొండ బోయినపల్లి, ముస్తాబాద గ్రామములలోను, కరీంనగరం తాలూకాలోను, ఎల్లారెడ్డి తాలూకాలోని ఎల్లారెడ్డి దానిచుట్టుముట్టు గ్రామాలలోను, జగ్త్యాల దానిచుట్టు గ్రామాలలోను, మహబూబునగరం జిల్లాలోని ధన్వాడ దాని పరిసర గ్రామాలలోను మెదకు జిల్లాలోని సదాశివపేట దానిపరిసర గ్రామాలలోను రోహిణికార్తె మొదలు ఇంతవరకు తుషారవర్షము తప్ప అంతమించి కురియలేదని ఈవార్తలలో ఉన్నది. మొదట మొదటపడిన అతుషారవర్షమును నమ్ముకొని రైతులు నాటిన విత్తనములు కొద్దిగా మొలకలెత్తి, ఆమొలకలిప్పుడు ఎండ తీక్ష్ణముచే దూడిపోవుచున్నవి ఇట్లు సజ్జ, జొన్న, మొక్కజొన్న పాడైనవి చెరువు, కుంటలలో నీరులేదు-బావులక్రింద భూములకు మోటలతో నీరుపారించి వరినార్లు వేయగా అనీరు చాలక గాలి, ఎండ అధికమై ఆనార్లు ఎండిపోయి రూపాయలలో నాల్గణాలపంటకూడ చేతికట్టుటకనిపించుటలేదు-ఈస్థితి అక్కవరం అచుట్టుపట్టు గ్రామాలలో కనపడుచున్నది

వర్షములేక గరిక మొలవక పశువులకుపచ్చిగడ్డి లేదు ఎండుగడ్డిఖరీదు చాల ఎక్కువగానుండి రైతులుకొనలేక బాధపడుచు, అచెట్లుఆకు ఈచెట్లుఆకు కోసికొనివచ్చి చాలీచాలకుండా వేయుచున్నారు అక్కవరం పరిసరగ్రామాదులలో పశువులు ఆ ఇదేసమయంలో రోగాలతగిలి మరణించుచున్నవి ధన్వాడలో అడవినుండి పశువులకై ఆకులకు కోసితెచ్చు రైతులనుండి చౌకీదారు సంచీగింకొకరూపాయి, గంపకు ౧కి ౪ రూపాయి వసూలు చేయుచున్నారట

ఇదేసమయంలో వర్తకులు ధాన్యాల ధరలను పెంచుటచే రైతులఅవస్థ మరీ చెప్పవలనికానిదైనది

ఈవిషయంలో జనగామప్రాంతంలో సర్కారువారు రైతులకు వరిత్తైరులకు ఎరువు, వేరుసెనగ పిండి, తక్కావియిచ్చుచున్నారట. సిరిసిల్ల, కరీంనగరం తాలూకాలలో రైతుల పరిస్థితినిగూర్చి తహసీలుకచేరికిని, పశువులస్థితినిగూర్చి పశువైద్యశాఖాధికారికిని అక్కడిఆంధ్రోద్యమపు అర్జనైజరుగారు ఇప్పింపజేసినారు. సదాశివపేటలో రైతులు వానదేవునిప్రార్థించు పనులుకీర్తించుచు భిక్షమెత్తుచున్నారట. బహుశా ఈభిక్షధాన్యము ప్రోగుకాగానే గంగాదేవికి పూజలుసల్పదరేమో!

ఇప్పుడు ఏవైనను క్రొత్త రోడ్ల నిర్మాణము మున్నగుపనులు బీదరైతులకు లాభకరముగునట్లు ఏర్పాటుచేసి పనులిప్పించవలెనని కొందరు రైతులు కోరుచున్నారు

## డ్రైనేజి అధికారులఆజ్ఞలు

(స్వ. వి.)

హైద్రాబాదు ౧౮ షహరేవరు ౧౩౫౦

హైద్రాబాదులో మూసీనదికి ఉప్పుకాలువ కలదు. వీటిక్రింద జహాందురులున్నిసాబేగంగారిభూములు బాగెలింగముపల్లి కొన్నినంబర్లు తహసీలుషర్కి అంబరుపేట, ఉప్పలని కొన్నినంబర్లుకలవు. వీటిలో డ్రైనేజివాండ్లు కొన్ని నంబర్లను, సేద్యముప్రదర్శనకై తీసుకొని స్వయముగా నిగరానిలో సాగుబడిచేసుకొనుచున్నారు ఈసేద్యముకొరకు కొన్ని వేలరూపాయిలు సాలుకు ఖర్చుచేయుచుందురు. లాభముమాత్రముసున్న ఇన్నిచేసియు ౧౩౫౦ ఫసలీలో యితరులకు అధికారమా కాల్వక్రిందిభూములపై వున్నరైతుల మాటలు సాగనేరవని పర్పెఖాసునకు కొన్నివేలు మామూలుయిచ్చి, కాలువక్రింది భూములను తమస్వాధీనములోకి తీసికొనిరి, అప్పటినుండి డ్రైనేజిఅధికారులు పెట్టుకష్టములు యిన్నిఅన్నికావు-చెప్పుకొనుటకును, వ్రాయుటకును మాచేతకాదు- యెప్పుడులేనిది యిప్పుడునూతనముగా ఒకదరఖాస్తుఫారము పైపుచేయించుకొని ఆసాములకు యిస్తున్నారు-అందులో మీసేద్యము యెప్పుడు ప్రారంభించుతారు, యేయే పంటపండించుతారు, అపంట యెప్పుడు పూర్తిచేస్తారు అనుప్రశ్నలు అదరఖాస్తులోగలవు- ఇంకను డ్రైనేజిఅధికారులను, మాపంటలను అరంభించుచున్నాము దయచేసి మాకు నీరుసప్లయిచేయగలరని ప్రార్థించుచున్నామని సంతకముతో డ్రైనేజిఅధికారికి పంపుకొనవలసినట్టుగ దరఖాస్తులు ఆసాములకిచ్చుచూ వాజ్మూలములు తీసుకొనుచున్నారు

మొన్న నే ౩౦ అమర్దాదు ౧౩౫౦ఫ- నాడు బాదోబస్తునుండి సున్యాయిచేసిరి- అందులోయొ౫ రాకు ౨౭ రూపాయిలు దోఫసులా ధ్రువపరచి ఒక్కొక్కరికి బోలెడురూపాయిలు సిస్తు కంటగట్టియున్నారు-దోఫసులాఅనుచు డ్రైనేజివాండ్లఅధికారము మాపైనఉండడము అగోచరముగానున్నది- తహసీలుదారుగారుకూడ మొన్నటిమంగళవారమునాడు దౌరాగావచ్చి డ్రైనేజిఅధికారులు చెప్పునట్లు గావినుచు వాండ్లకు సేద్యముచేయుచున్నవాటిని తెలియపరచుచుండవలెనని తెల్పిరి- పన్నులోమాత్రము యేమాత్రము తప్పుచేయడములేదు ఆంధ్రమహాసభవారు ఈవిషయమున హైద్రాబాదునగరమునకు దగ్గరలేనాల్గుమైళ్ళలోనుండు ఉప్పలగ్రామములో దౌరాచేసి వీరికష్టములు తెల్సికొని అధికారులకు ఈరైతులమొరలుఅందజేసి వారికష్టములను తొలగించగలరని ప్రార్థన-

ఇట్లు
ఒకరైతు

## వైశ్యగృహములో పశుబలి

(ఒకవిలేఖరి)

హైదరాబాదు [దక్కన్] షహరేవరు౧౭ అంజూలైరరం ఆదివారం ఉదయం కాచెగూడెంలో ఒక వర్తకుడు ఈసంవత్సరము అమ్మవారిపూజను నూతనపద్ధతిలోచేసెను-అతని రెండుకోళ్ళు ఒకమేకనుతెచ్చి తిమఇంటినుండి బోనములతీసి, పెళ్లోళ్ళను దేవాయం చుట్టు తిప్పవదలిపెట్టెను మేకను తమబోనములయెదుట బలి నిచ్చి అమ్మవారిశాంతిపరచిరి

## ధర్మవాడ

### ఖాదిటోపి కాటంకము

మహబూబునగరముజిల్లాలోచేరిన పెద్దగ్రామమగు ధర్మవాడలో ఒక పద్మశాలీయ బాలుడు వెంకటయ్యఅనువాడు ఒకపద్మశాలీయు గర్భాధానము జరుగుసమయములో గాంధిటోపి, ధరించి అచటికి విందుకువెళ్ళియుండెను వానిని జూచి ఒకపద్మశాలీయమహాశ్రేష్ఠిగారువర్తుటోపీనితీసి మాగర్భాధునసంఘమునకు రావలసినది అనిరి తుదకుఒకబునేజనుడు బాలుని సంఘములోనికిగొనిపోయెను.

### పశువుల మేతయిబ్బంది

పైగ్రామములో వర్షకాలము ప్రారంభము మొదలుకొని నేటివరకు వర్షముకురియనందున పశువులకుమేత బొత్తిగాఅయిపోయినది అన్నిజాతులకంటె పద్మశాలీయజాతికి విదేశయుద్ధములు ప్రబలిననాటినుండి నేటికి బారికిలభించు నూలురేషమ్,రంగు మున్నగువస్తువులు చీనా జపాను, సరకు సకాలమునకురానందున మొదటకు౩ పెనూలు రెండితలు రేషమ్, రెండంతలు రంగు నాల్గంతలు ధరలుహెచ్చినందున నేతసరకుహెచ్చుఖరీదులేక పద్మశాలీయులవృత్తి తగ్గినందున అన్నపానాదులకు యి తింతకష్టమని చెప్పనలవిగాదు కొందరుబీదలు సమీపమున మానుకోసులపైన గట్టుసపోయి పశువుల గోడుచూడలేక నేరపఅకును బరికి తెచ్చి పశువుల క్షుద్బాధ నివారణచేయుచున్న చౌకీదారు గారు ఎవ్వరెవ్వరు అకునుబరికితేగలరో వారికి సాంచిఒకటికి ఒక్కరూపాయి గంప ౧కి అర్థరూపాయిచొప్పున వసూలుచేయుచున్నారు యిట్టిమామూలు ఇవ్వలేక కొందరు తమపశువులను వదలివేసిరి కొందరు చుట్టుపక్కనులయుండ్లకుకొట్టిరి మరికొందరు మేతలేకచంపుకొనిరి యిట్టికష్టములుగ్రహించక పశువులమేతకు మామూలుగైకొనుట చౌకీదారుగారికిఉచితంగాదు-

ఇట్లు
ఆర్యమంత్రి జిల్లాప్రచారక్ -ప. సాంబమూర్తి

### సవరణ

ఈ౧౬వసంపుటము ౨౪వసంచిక (ఆషాఢబ॥ ౧౨॥ సోమవారం)లో శ్రీ లోకసత్తి రాఘవేంద్రాచార్యులవారికి చేసిన ప్రశ్నలలో ౫వప్రశ్నలో "వర్ష"అనిపడినగానిని పాఠకులు "వర్ణ"అని దిద్దుకొందురు గాక

## మన క్రొత్త ప్రధాన మంత్రి

హైద్రాబాదు (దక్కన్), జూలై ౨౭

ఛతారీనవాబుఅగు సర్ అహమ్మద్ సయీద్ ఖాన్ గారు రై. ఆ సర్ అక్బర్ హైదరీగారి స్థానములో మ- ఘ- నిజాంప్రభుత్వప్రధానమంత్రిగా నియుక్తులైనట్లు ప్రభువుగారిఫర్మాను వచ్చినది మొదటవారిని మూడేండ్లకై నియోగించుచున్నారు- తర్వాతఅవసరమైనచో మరిరెండేండ్లకాలము ఉంచెదరు

వీరికిఆదాయపుపన్ను బాధలేకుండా నెల ౧కి రూ౫౦౦౦కల్దారుల గౌరవవేతనము యివ్వబడును ఒకప్రభుత్వపుమోటారు వారిపనికై యివ్వబడును వారినివాసానికై ఒకగృహము యివ్వబడును ప్రభుత్వపక్షమున విందులుమున్నగునవి చేయవలసివచ్చుచుండును గనుకఒండుకై నెల౧కి రూ౧౦౦౦లు యివ్వబడును వీరురాబోవు సెప్టంబరులో పనిస్వీకరింతురు

### మాఘమేల

అలహాబాదులో ముందుసంవత్సరం జనవరి ౧౪తేదీనుండి ఫిబ్రవరి౧౬వతేదీవరకుమాఘమేలజరుగును ఆసమయంలో ౩౦లేక ౩౫లక్షలజనమచ్చటికివెళ్లుదు అసనుయంలో కలరావ్యాప్తి కాకుండా రైల్వేలో నిగరానీ చేయబడును

ఈకుంభమేలలో ఒకవిశేష మున్నదందురు. పూర్వము మహాభారతకాలంలోకురుక్షేత్రయుద్ధసమయములో ఏనక్షత్రకూటం ఒకటైయుండెనో ఆదేనక్షత్రకూటమే ౧౯౪౨సం॥ జనవరి౧౬నాడు ఏర్పడుచున్నదని దైవజ్ఞులంటున్నారు- మనరాష్ట్రదైవజ్ఞులు దీనిని పరిశోధింతురుగాక.

గో. ప్ర.

### దేవిరిశెట్టి రంగయ్యగుప్తగారి నిర్యాణం

మహబూబాబాదు, జూలై ౨౨

నేడు వైశ్యయువజనసంఘ ప్రధానసభ్యులలో ఒకరైన శ్రీయుత దేవిరిశెట్టి రంగయ్యగుప్తగారు హఠాత్తుగా పరమపదమందిరి, వీరుమా సంఘనిర్మాణములో శక్తివంచనలేకుండ అపారసేవచేసినయువకులు. వీరిజ్ఞాపకార్థమై మాపఠనాలయమునుమూయుచు, వీరిఆత్మకు దేవుడు శాంతినొసంగుగాకయని, వైశ్యయువజనసంఘంతరపునప్రార్థిస్తు ప్రత్యేకముగా వారికుటుంబమునకు మాహృదయపూర్వకముగా సానుభూతి తెలియబరచుచున్నాము భువనగిరినారాయణగుప్త




Printed and Published by G Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad-Dn Editor- S Prathapa Reddy B A B.L.